సాం = నాగకన్యకలలోఁగాని గంధర్వులలోఁ గాని రాక్షసులలోఁగాని; యక్షాణాం=యక్షులలోఁగాని; కిన్నరాణాంవా = కిన్నరులలోఁ గాని; కా=ఎవ్వతెవు;భవసి=అగుచున్నావు?

మంగళకరివగుదానా!నీవు,"దేవతలు,అసురులు, నాగకన్యలు, గంధర్వులు, రాక్షసులు,యక్షులు, కిన్నరు వీరలయందు, ఎవ్వరిలోఁజేరినదాన? అని, తాత్పర్యము.

కాత్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే
వసూనాంహి వరారోహే దేవతా ప్రతిభాసి మే. ౬

టీక॥ వరాననే = సుందరమయిన ముఖముగలదానా! రుద్రాణాం = రుద్రులలోఁగాని; మరుతాంవా=వాయువులలోఁగాని; వసూనాంవా= వసువులలోఁగాని; త్వం=నీవు; కా=ఎవ్వతెవు? వరారోహే =సుందరములయినపిఱుఁదులుగలదానా! మే=నాకు; దేవతా=దేవతవుగా; ప్రతిభాసి= అగపడుచున్నావు.

సుందరమయిన ముఖంబు గలదానా!నీవు, రుద్రగణంబులోఁజేరిన దానవా?వాయువులలోఁజేరినదానవా?లేక, వసువులలోఁ జేరినదానవా? నీవెవ్వతెవు?సుందరములయినపిఱుఁదులుగలదానా! నీవుదేవతవనినాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

కిన్ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా. ౭

టీక॥త్వం=నీవు;చంద్రమసా =చంద్రునిచే; హీనా= విడువఁబడినదియు; విబుధాలయాత్= స్వర్గమునుండి; పతితా=పడినదియును ; జ్యోతిషాం=నక్షత్రములలోపల; శ్రేష్ఠా=ఉత్తమురాలయినదియు ; శ్రేష్ఠసర్వగుణాన్వితా=ఉత్తమములయిన యన్నిగుణములతోఁగూడినదియునగు; రోహిణీకిన్ను=రోహిణివా?

నీవు , చంద్రునివిడిచి స్వర్గంబునుండిభూమికివచ్చియున్న, నక్షత్రశ్రేష్ఠయును త్తమగుణంబులు గలదియు నగు, రోహిణివావేమి? అని, తాత్పర్యము.

కాత్వం భవసి కల్యాణి త్వ మనిందిత లోచనే

టీక॥ కల్యాణి=మంగళస్వరూపిణి వగుదానా! త్వం=నీవు; కా=ఎవ్వతె వసి=అగుచున్నావు? అనిందిత =నిందింపఁబడనికండ్లుగల దా త్వం = నీవు ; కా(అధ్యాహృత ము)=ఎవ్వతెవు?

మంగళస్వరూపిణివగుదానా! నీవె వ్వతెవు? ఎంతమాత్రమునుదోషములేక సులక్షణయుక్తంబులయి సుందరంబుల యినకండ్లుగలదానా!నీవెవ్వతెవు? చెప్పుము. అని, తాత్పర్యము.

కోపాద్వా యదివా మోహాద్భర్తారమసితేక్షణే. ౯
వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యాణ్యరుంధతీ

టీక॥ అసితేక్షణే = నల్లనికండ్లుగలదానా! కల్యాణి = మంగళకరివగుదానా! త్వం=నీవు; కోపాద్వా=కోపమువలనఁగాని; మోహాద్యదివా=ప్రేమవలనగాని; భర్తారం= పెనిమిటి యయ్యు; ; వసిష్ఠం=వసిష్ఠునిగూర్చి; కోపయిత్వా=కోపించి, ఆగతా(అధ్యాహృతము)=భూమికివచ్చిన; అరుంధతీ=అరుంధతివి; నాసి (కిం)= కావా యేమి?

నల్లనికండ్లుగలదానవు మంగళకరి వగుదానా! నీవు కోపమునఁగానిప్రణయకోపంబువలనఁగాని పెనిమిటియగు వసిష్ఠునిపైఁగోపంబుపూని, భూమికివచ్చినయరుంధతివికావా యేమి?
అని, తాత్పర్యము.

కోను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే. ౯

టీక॥ సుమధ్యమే= సుందరమయిన నడుముగలదానా! తే=నీయొక్క; పుత్రః= కొడుకుగాని ; పితా=తండ్రిగాని; భ్రాతా=తోఁబుట్టువుగాని;భర్తా వా= పెనిమిటిగాని; కోను= ఎవ్వఁడు.

సుందరమయిననడుముగలదానా! నీకొడుకెవ్వఁడు?తండ్రియెవ్వఁడు?నీసహోదరుఁడెవ్వఁడు? నీపెనిమిటియెవ్వఁడు?నాకుఁజెప్పుము.
అని, తాత్పర్యము.

అస్మాల్లోకాదముంలోకం గతం త్వమనుశోచసి